త్యాదులయందున్న చెప్పబడిన అసహాయాదులను వాటికి అంగముగా చె
న పాదప్రక్షాళనాదులు వినగా శరణాగతినల్లు ఈశ్లోకమందు
న్న పరిత్యజ్య అనుల్యబంతపదముచేతను చెప్పబడుచున్న సాధ
నాంతరపరిత్యాగము వినాగా సిద్ధోపాయ స్వీకారమున్ను చే
యకూడదు అనే అర్థము సిద్ధము.

కొందరు ఈశ్లోకమందు చెప్పబడుచున్న సాధనాంతరపరి
త్యాగమును విధిగా ఒప్పక అజ్ఞానముచేతనున్ను అశక్తిచేతను
న్ను, చేయ సంభవించేది అని అనువాదముగా అంగీకరించి అట్టి అ
జ్ఞులు అశక్తులు మొదలగు వారలకు ఈసిద్ధోపాయము విధిం
పబడుచున్నదని చెప్పుదురు.

ఆపక్షము కేవలమయుక్తము.

పిత్రాద్యాత్యాది, పాదౌ, పాణులను ప్రక్షాళ్యశోధనము
చేసికొని, ఆచామేత్ ఆచమనము చేయవలయును. స్థిత్వానిలువబ
డి, భానవే, సూర్యునికొరకు, అర్ఘ్యం అర్ఘ్యప్రదానమును ద
ద్యాత్, ఇవ్వవలెను. స్నాత్వా స్నానముచేసి విధివత్, యథా
శాస్త్రముగా, అర్చయేత్ పూజచేయవలయును దేవం, దైవమును
ధ్యాత్వా, ధ్యానముచేసి, మనుం, మంత్రమును, జపేత్ జపింప
వలయును, అని అర్థము.

౫. ఈ ఉపాయము, ఇతరోపాయమువలెనే శక్యసాధ్యము
గాక సులభమైయుండుటచేతను చేతనునికి రాగప్రాప్తి యన
గా ఇష్టమైయుండగా వేరే విధించుటకు కారణమేమున్నను ఒక
రోగభోగ్యమైన పాలుతాగవలెననే వాంఛగలిగియున్నప్పుడు ఆ
పాలనే మందుగా విధించిన పక్షమందు వాడు శీఘ్రముగా త్రాగు
టకు హేతువయినట్లు ఇతరోపాయములకన్న ఈ యుపాయము వి
లక్షణమైనదగుటచేత దీని స్వీకరించవలెనని వాంఛించిన చేత
నునికి ఈయుపాయమునే పరిగ్రహించుమని విధించినయెడల శీఘ్ర
ముగా పరిగ్రహించుటకు పనియుక్తమైయుండును.

౬. ఉత్తరపు శ్లోకమందలి పూర్వార్థము సర్వధర్మా[illegible]

మనము సాధనములు కానివాటియందు సాధనబుద్ధిచేసిన యీ అజ్ఞానముతోకూడా విడిచిపెట్టుట.

౧౮. పరియను ఉపసర్గార్థము చెప్పబడును.

పరియను ఉపసర్గముచేతను, బ్రహ్మహత్యయు, సురాపానము, స్వర్ణస్తేయము, గుర్వంగనాగమనము, మొదలయిన మహాపాతకములను అజ్ఞానముచేత చేసి తరువాత లజ్జపడి పశ్చాత్తాపమును పొంది విడచుకొనునప్పుడు యెన్నడును వాటిలో బుద్ధిపూర్వకముగాగాని అబుద్ధిపూర్వకముగాగాని ప్రవర్తింపకుండా రుచివాసనలతోకూడా వదులుకొన్నట్లు పాతకశబ్దముచేత చెప్పబడుచున్న ఉపాయాంతరములను పునరన్వయములేకుండా రుచివాసనలతో కూడా విడవవలయును అను అర్థము చెప్పబడుచున్నది.

౧౯. త్యక్త్వా అను ల్యప్ప్రత్యయార్థము చెప్పబడును.

త్యక్త్వా అను ల్యప్ప్రత్యయముచేతను స్నాత్వా భుంజీత అను విధియందు స్నానముచేసియే భుజింపవలెను అను నియమమును చెప్పినట్లు ఈ సిద్ధోపాయస్వీకారమునందు యమునున్న విడువవలసిన కర్మజ్ఞానాది రూపములైన ఉపాయాంతరములను విడిచియే స్వీకరింపవలయును అను నియమము చెప్పబడుచున్నది.

౨౦. అశక్తుడయిన రావణుడు రామబాణములచేతను ధనుస్సు ఖండింపబడి శిథిలమైన శరీరముగలవాడై మనస్సు కాలుష్యమును జెంది యుద్ధము చేయచాలక పారిపోవలెనని ప్రయత్నపడుచున్నప్పుడు స్వామి పోనియ్యక బాణములను ప్రయోగించుచు నుండిరి ధర్మయుద్ధము చేయు స్వామి మనలను పోనియ్యక పోవడమునకు హేతువేమని ఊహించి తనచేతులలోనున్న ధనుర్దండమే కారణమని నిశ్చయించి భయపడి దానిని విడిచిపెట్టెను. అతనున్న రావణునికి యుద్ధమునకు సాధనము కాకపోవుట పరక పారిపోవుటకు కూడా ప్రతిబంధకమయినట్లు ఈ ఉపాయములున్న సాధనములు కాకపోవుటయే గాక ధర్మమునకు ప్రతిబంధకము లు

కంటితో చూడతగినట్లుగా చేయుటచేతను సౌలభ్యమున్ను స్ఫుటముగా ప్రకాశించుచున్నవి.

౩౬. గుఱ్ఱములను తోలుటకు హస్తమందు ధరించిన వేత్రమును అనగా కొరడాయును ఎటువైపు వలసిన అటువైపు త్రిప్పుటకును నిలుపవలసినస్థలమందు నిలుపుటకును పట్టుకొన్నలగాములును, తలయందు కిరీటము మొదలైన ఆచ్ఛాదనము లేకపోవుటచేతను సేనాధూళిచేత కప్పబడ్డ శిరోజములును రథమునకు క్రిందుగా వ్రేలవేసిన శ్రీపాదములును కలవాడై నిలిచియున్న సారథ్యవేషమును, మామ్. అని కనపరచుచున్నాడు.

౩౭. ఏకమ్, అనుపదమునకు అర్థము చెప్పబడును.

౩౮. ఈ ఏకశబ్దము స్థానప్రమాణముచేతను ఏవకారార్థమును చెప్పును, స్థానప్రమాణమనగా ఏకశబ్దస్థానమందు ఏవకారము ప్రయోగింపబడియుండుట అనగా ప్రపత్తిని చెప్పుస్థలములయందు ఏవకారముండుటచేతను, ఆఏవకారస్థానమందు ఇచ్చట ఏకశబ్దముండుటచేతను, ఈఏకశబ్దమునకును ఏవకారార్థమే చెప్పబడును.

౩౯. మామేవయే ప్రపద్యన్తే, నన్నే ఎవరుప్రపత్తిచేయుచున్నారో తమేవచాద్యం పురుషం ప్రపద్యే, కారణుడైన ఆపురుషునే ప్రపత్తిజేయుచున్నాను. త్వమేవోపాయభూతో మేభవ, నీవేనాకు ఉపాయభూతుడవుకమ్ము, ఆఱెనక్కునిన్ పాదమే శరణాగత్తన్దొழిన్దాయ్ నాకు ప్రాప్తికి ఉపాయమును ఉపదేశించునసమయమందు నీపాదములనే ఉపాయముగా ఉపదేశించినావు, ఇత్యాదులయందువలెనే, మామేకం అనే ఈస్థలమందును నన్నే అని ఏవకారార్థమునే చెప్పవలయును.

౪౦. ఏవకారార్థమును చెప్పు ఈఏకశబ్దముచేతను వ్రజ అను పదమందు చెప్పబడుచున్న అధ్యవసాయరూపమయిన సిద్ధోపాయస్వీకారమందలి ఉపాయత్వము తీసివేయబడుచున్నది. అనగా నీవేనాకు ఉపాయముకావలెనని భగవత్సన్నిధియందు [illegible]

తనుచేయు నీ ఉపాయస్వీకారము వాడిచ్చు ఫలమునకు ఉపాయ
ము కాదు. ఆ ఈశ్వరుడే ఉపాయము అని చేతను చేయుస్వీకారమంద
లి ఉపాయత్వమును తీసివేయుచున్నది.

౪౧. ఈసిద్ధోపాయానన్తరమందే ఫలము సిద్ధించుట చేతనును
స్వీకారము లేనప్పుడు ఫలము సిద్ధింపకపోవుటచేతనును ఈస్వీకారము
ఫలసిద్ధికి అవశ్యముండవలసియుండగా ఇట్టిస్వీకారమందు ఉపా
యత్వము ఎటులు తీసివేయబడును. అంటే ఈస్వీకారానంతరమం
దు చేతనునికి కలుగబోవుఫలసిద్ధి ఉపాయభూతుడైన ఈశ్వరుని
చేత సిద్ధించినట్లే ఈస్వీకారమున్ను వానిచేతనే సిద్ధించును.
ఇందువల్ల ఈస్వీకారము ఉపాయభూతుడైన ఈశ్వరునివల్ల పు
ట్టినదిగాని సాక్షాత్ ఉపాయము కాదు.

౪౨. ఈసిద్ధోపాయభూతుడయిన ఈశ్వరునివల్ల ఈఉపా
యస్వీకారము పుట్టుటయనగా ఈచేతనులు కరణకళేబరములు
లేక అందువల్లనే భోగమోక్షములను చెడి, అచిత్ప్రాయులై పడి
యున్నదశయందు, కరణకళేబరములనిచ్చి, జ్ఞానవికాసమును కలు
గచేసి, తానును అనేక అవతారములనవతరించి, ఆశ్రయణరుచి, వి
శ్వాసములను పుట్టింపతగిన తనకళ్యాణగుణచేష్టితములను ప్ర
కాశింపచేసి ఈవిధముగా వాడుచేసిన కృషిచే ఫలించినదనుట.

౪౩. జ్ఞానాధికులయిన నిత్యసూరులకు నిర్వాహకుడైన స
ర్వేశ్వరుని కటాక్షము ప్రసరించినది దానివల్ల వానినిపొందుటకై
వానిని జ్ఞానముండుంచుకొన్నాను. అనగా వానినే ఫలసాధనముగా
చూచికొనినాను. అనినమ్మాళ్వారు భగవల్లాభమునకై సిద్ధో
పాయము స్వీకరించినానని పాడుచు ఆసిద్ధోపాయస్వీకారము
ను వానినిర్హేతుకకృపచేతనే నాకుకలిగినది అనిపాడియుండినందువల్ల
ఈస్వీకారము ఈశ్వరునియొక్క కృషిఫలమనియే గ్రహింప
వలయును.

౪౪. చేతనునకు సిద్ధోపాయస్వీకారమందు రుచిపుట్టుటకు
కృషిచేయువాడున్ను ఈశ్వరుడే అందువల్ల ఈచేతనులు సిద్ధో

పాయ స్వీకారము చేసిన మాత్రముచేత ఫలమిచ్చునని యున్, అది లేకపోయినప్పుడు ఇయ్యడనియును తలంపక ఆత్మోజ్జీవనమునకే సర్వదా యత్నించు సర్వేశ్వరుడు మనయొక్క ఇష్టప్రాప్తి, అనిష్టనివారణ, రూపమయిన ఫలమును కలుగుచేయువాడని ప్రతిపత్తి కలిగియుండవలయును.

౪౫. ఈసిద్ధోపాయ స్వీకారము చేయకపోయినను చేతనుల యొక్క కార్యములను ఈశ్వరుడు చేయునని తలపక ఈసిద్ధోపాయస్వీకారమున్ను అవశ్యము కార్యసిద్ధికి ఉండవలెనని తలచినయెడల ఉపాయభూతుడయిన ఈశ్వరుని యొక్క సహాయాన్తర వైరపేక్ష్యమునకు భంగము వచ్చును.

౪౬. ఈశ్వరుడు సర్వసముడగుటవలన చేతనకృత్యమును లేశమును అపేక్షింపకయే ముక్తి నిచ్చునప్పుడు, అందరికిని ఒక్కపర్యాయము ఇయ్యక కొందరికే ఇయ్యడమునకు హేతువు ఏమను ప్రశ్నమునకు పరిహారార్థమును, ఇంతకాలము మనలను రక్షింపని ఈశ్వరుడు నేడు రక్షించునా అను సంశయము కలుగునప్పుడు తన్నివృత్తి కొరకును, ఈసిద్ధోపాయస్వీకారము వ్యాజమై యుండును.

ఆత్మ అచేతనము గాక చైతన్యము కలవాడై యుండుట చేతనును భగవదేకోపాయత్వరూపమైన ఈ అధ్యవసాయము చైతన్యకార్యమయ్యే యుండును, ఉపాయము కాదు. ఈసిద్ధోపాయము, విధింపబడి వచ్చినది కాదు చేతనుని యొక్క రుచిని బట్టి వచ్చినది.

భగవదేక రక్షకత్వరూపమైన స్వరూపమునకు విరుద్ధము కాదు. అనుగుణమే, అనాదికాలమునుండి స్వయత్నము చేతను ఈశ్వరుడు చేయు రక్షణమును అంగీకరింపని చేతనుడు అంగీకరించినందుకు సూచకమును అయియుండును.

౪౭. మామ్, అనుపదమునకు పూర్వమందున్న సర్వధర్మాన్ పరిత్యజ్య అనుస్థలమందు సర్వధర్మపరిత్యాగము చెప్పిన సర్వేశ్వరుడు తననును ఉపాయాంతరములనును ఉపాయముగా తలపక ఒక్క తననే ఉపాయముగా తలపుమని చెప్పెను. ఏకమ్, అనుస్థలమం

ము స్వీకారమందు ఉపాయభావమును తీసివేసి తనను ఉపా
యస్వీకారము చేయువానిని ఉపాయముగా తలపక, ఒక్కత
నే ఉపాయముగా తలంపుమని చెప్పుచున్నాడు.

౪౮- నిరుపాధిక రక్షకుడైన ఈశ్వరుని రక్ష్యభూతుడైన చే
తనుడు తనరక్షణమున కుపయుక్తముగా ఆశ్రయించిన ఆశ్రయణ
ము అనగా స్వీకరించు స్వీకారము అహంకారగర్భము, కొమారు
డు తననుపోషించుటకై తండ్రిచేత వ్రాయించుకొన్నట్లుగా ●
పద్యకరమును అనగా నింద్యమున్ను.

౪౯- చేతనులను రక్షించుటకు సమర్థుడైన ఈశ్వరుడు ర
క్షించుటకు అభిమానించి పరిగ్రహించుటయను స్వీకారమే ఆచేత
నులకు రక్షకము.

౫౦- సిద్ధోపాయముకన్న ఇతరములైన ఉపాయాంతరముల
యొక్క స్వరూపము చేతనప్రవృత్తిరూపమైన వ్యాపారముచేత
నే సిద్ధింపవలసియుండుటచేతను వాటికి ఆచేతనునియొక్క స్వ
యత్ననివృత్తి దోషమై యుండును. ఆసిద్ధోపాయము సహా
యాంతరమును సహింపక పోవుటచేతను దీనికి ఆచేతనునియొక్క
ప్రవృత్తిరూపమైన వ్యాపారము దోషమై యుండును.

౫౧- నమ్మాళ్వారులు సిద్ధోపాయస్వీకారమును ఉపదేశించు
సమయమందు విశేషించి వ్యాపించవలసినక్కరలేదు. [illegible]ంచుటయే
చాలును అని ఉపదేశించినందువల్ల ఆసిద్ధోపాయ స్వీకారమును
చేయువారలకు ఏవ్యాపారమును చేయనక్కరలేదు.

౫౨- క్రింద, అనగా సర్వధర్మాన్ పరిత్యజ్య అనుశ్లోకమందు
ఆచేతనులయొక్క సకలప్రవృత్తినివృత్తియును చెప్పబడెను.

౫౩- నాయొక్క దుష్టమనస్సును పోగొట్టి వారు నిన్ను అను
భవించి సేవించుటకు మనస్సును ఇచ్చెవారు. అని ఉపాయభూతు
డైన ఈశ్వరుని విషయమై చేతనునికి కలుగు ఉపకారస్మృతియు
ను, చైతన్యమును పట్టివచ్చినదిగనుక ఉపాయములో చేరదు.

౫౪- శరణమ్ అనుపదమునకు.

౫౫. ఉపాయముగా అని అర్థము.

౫౬. ఈశరణశబ్దము లక్షించువానిని, స్వరూపము ఉపాయముగా కనపడినను ఈస్థలమందు అనగా ఉపాయాంతరములను విడచి ఈశ్వరునే ఉపాయముగా స్వీకరించు స్థలమందు, ఉపాయమునే కనపడ్డను- ఏలనుచేతనంటె సర్వోపాయములను విడచి ననే పట్టుమని చెప్పుచున్న స్థలమగుటచేతను ఉపాయమును చెప్పిననే సర్వధర్మాన్ పరిత్యజ్య అను క్రిందివాక్యముతో చేరును ఆ లాగు చేరని పక్షమునకు ప్రకరణభంగమను దోషము వచ్చును ప్రకరణభంగమనగా ఒక అంశమును ఉపపాదించుచు దానికి విరుద్ధమైన అంశమును గాని దానితో సంబంధింపని అంశమును గాని చెప్పుట.

ఈశ్లోకమందు చెప్పబడిన సర్వధర్మపరిత్యాగము ఈశ్వరుని యొక్క ఉపాయత్వమును కనపరుచుచుండగా, శరణశబ్దప్రయోగమునకు అవసరము లేదని కొందరందురు- ఉపాయాంతరత్యాగము చెప్పబడినను అది సిద్ధోపాయ స్వీకారసమయమందువలెనే ప్రాప్యసమయమందును సమానమైయున్నది- ఎందుచేతననగా ప్రాప్యసిద్ధ్యనంతరమందు ఏరుదాటిన వెనుక నావతో ప్రయోజనము లేనట్లు ఉపాయాంతరములతో ప్రయోజనము లేదు కాబట్టి. ఈఉపాయాంతర త్యాగముతో కూడియున్నను వ్రజ అనుపదములో చెప్పిన స్వీకారమాత్రము ప్రాప్యసమయమందలి స్వీకారమును తీసివేసి సిద్ధోపాయస్వీకారమును స్థాపింపజాలదు.

సిద్ధోపాయస్వీకారమున కంగముగా విధింపబడిన ఈఉపాయాంతరత్యాగము అంగియైన సిద్ధోపాయస్వీకారమును అర్థముగా కనపరచినను దానికన్న ప్రాధాన్యముగా చెప్పబలమగుటచేతను అవశ్యము శరణశబ్దప్రయోగముండవలయును.

౫౭. వ్రజ, అనుపదమునకు.

౫౮. బుద్ధిచేయుము అని అర్థము.

౫౯. వ్రజగతౌ అనుధాతువు గతిని చెప్పును, యేగత్యర్థాః, తే

సా నార్థాః అనవ్యాయము చేతను గత్యర్థమును చెప్పి వ్రజధాతువు బుద్ధ్యర్థమును చెప్పును, దీనివల్ల వ్రజ అను ధాతువునకు అధ్యవసింపుము అని అర్థము. ఈ అధ్యవసాయమనునది త్యాజ్యములైన ఉపాయాంతరములలోనుండి దాటినదై, వాటికంటె విలక్షణమైనదై అధికారాంతర త్యాగమే అంగముగాగలదై భగవత్ప్రత్యక్షత్వానుమతిరూపమైనదై, చైతన్యకార్యమై, ప్రార్థనారూపమైనదై, భగవన్ముఖవికాసమునకు హేతువై, స్వరూపానుగుణమై, ఫలమును అలవ్యము చేయక తప్పకుండ నిచ్చునదియైయుండు జ్ఞానవిశేషము-

౬౦- ఆళ్వారు శరణత్రియము చేతను ప్రపత్తి చేసినట్లుకనబడుచున్నది కాబట్టి అధికారిపూర్తికి శరణత్రియమును అపేక్షితమే, అయినను ఫలసిద్ధికి జ్ఞానాన్మోక్షం అని భాగవతమందు చెప్పబడుటచేతను మానసికాధ్యవసాయ మాత్రము చాలును-

౬౧ సర్వధర్మాన్ అనుపదము చేతను, విడువవలసిన ఉపాయములను చెప్పి, పరిత్యజ్య అనుపదము చేతను విడచు ప్రకారమును చెప్పి, మామ్ అనుపదము చేతను, ఆశ్రయింపబడు ఉపాయభూతుని చెప్పి, ఏకమ్, అనుపదము చేతను వాని యొక్క నైరపేక్ష్యమును జెప్పి. శరణమ్ అనుపదము చేతను ఉపాయత్వమును జెప్పి, వ్రజ, అనుపదము చేతను ఉపాయ స్వీకారమును చెప్పి సాంతపరుచుచున్నారు-

౬౨- ఈ శ్లోకము యొక్క ఉత్తరార్థమునకు అర్థము చెప్పుటకై, ముఖ్యముగా అహమ్ అనుపదమును ఎత్తుచున్నారు-

౬౩- ఈ ఉత్తరార్థము చేత ఈశ్వరుడు ఉపాయభూతుడైన తాను చేయు కృత్యమును చెప్పుచున్నాడు-

౬౪- అహమ్ అను శబ్దమునకు, సర్వజ్ఞుడై, సర్వశక్తికలవాడై, రక్షించుటకు తగిన శేషిత్వరూప సంబంధముగల నేను అని అర్థము-

౬౫- ఈ అహమ్ అనుపదము, ఈ చేతనునికి ఈశ్వరుని ఇష్ట

ప్రాప్తి, అనిష్టనివారణములను చేయునపుడు తనిపూర్వ, ఉత్తరస్థి
తులను తెలిసికొనుటకును అటుపిమ్మట వీనికార్యమును చేయుటకు
ను అవశ్యకమయిన సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వములనును చేతనునిక
చేయు కార్యములను స్వకార్యముగా దలచి నెరవేర్చుట కుప
యుక్తమైన శేషిత్వరూపసంబంధమునును, అవాప్తసమస్తకా
మత్వమును పూర్తినిన్ని ప్రకాశింపజేయుచున్నది-

౬౬- మామ్ అనుపదమునందు నీకుసారథిని అయినిలిచియున్న
నన్ను, ఉపాయముగా ఆశ్రయింపుమని స్వామిచెప్పినప్పుడు, అ
ర్జునుడు తనరక్షకార్థమై స్వామిధరించిన సారథ్యవేషమును
చూచి, సర్వస్వామి అయినవాడు ఇట్టినీచకృత్యమందునిలిచినది- ఆ
యనసౌశీల్యముచేతనని తలపక మనకునీచకృత్యమును చేయువాడు
మనలనురక్షింపగలుగునా అని తననుపట్టిచూచి భయపడగా అట్టి
భయము, తీరునట్లునిరంకుశస్వాతంత్ర్యరూపమైన పరత్వమును
అహమ్ అనుపదముచేతనుప్రకాశింపజేయుచున్నాడు-

౬౭- ఇట్టిపరమస్వతంత్రుడను ఈశ్వరుడు అర్జునునికి సా
రథియైనిలిచిన ఈపారతంత్ర్యమున్ను తనయొక్క నిరంకుశ స్వా
తంత్ర్యకార్యమే-

౬౮- త్వా అనుపదమునకు-

౬౯- నీకార్యమును తెలిసికొనుటకు తగినజ్ఞానములేనివాడ
వై తెలిసినను నెరవేర్చుకొనుటకు తగినశక్తిలేనివాడవై, శక్తికలిగి
యుండినను నీయొక్క రక్షణమందు నీకుప్రాప్తిలేనివాడవై, అన
గా సంబంధములేనివాడవై, యుండుటచేతను స్వతంత్రోపాయ
ములయిన సర్వధర్మలను విడిచి నన్నేనిరపేక్షసాధనముగా పట్టి
యున్న నిన్ను అని అర్థము-

౭౦- సర్వపాపేభ్యః అనుపదమునకు-

౭౧- నాప్రాప్తికి ప్రతిబంధకములని అనగా, మోక్షప్రతిబంధక
ములని యేయేపాతకములనుచూచి భయపడుచున్నావో ఆయా
పాపములన్నిటివలననుండి అని అర్థము-

ఈ స్థలమందు భగవత్ప్రాప్తి విరోధులను మాత్రము చెప్పుటచే జ్ఞానవిరోధులును రుచివిరోధులును ఉపాయవిరోధులును పూర్వాధ్యాయములయందే తెలిపివేయ బడినట్లు స్పష్టమగుచున్నది.

పాపశబ్దము యొక్క బహువచనార్థము చెప్పబడుచున్నది.

౭౨. దేహాత్మాభిమానమనెడు, అసత్యజ్ఞానమున్ను సాంసారిక ప్రవృత్తిరూపమయిన దుష్టవ్యాపారమున్ను, రక్తమాంసాదిమయమైన మలినదేహమున్ను అని ఆళ్వార్లు తిరువిరుత్తమను ప్రబంధము యొక్క మొదటిపాశురమందు పాడిన ప్రకారముగా అవిద్యయు, కర్మము, వాసనయు, రుచియు, ప్రకృతిసంబంధమును చెప్పబడుచున్నవి.

౧. అవిద్యయనునది, అజ్ఞాన, అన్యథాజ్ఞాన, విపరీతజ్ఞానములని మూడువిధములుగానుండును, అజ్ఞానమనగా, జ్ఞానము పుట్టకపోవుట, అనగా, దేహముకంటె వేరే ఆత్మ ఉన్నాడను జ్ఞానము లేకపోవుట. అన్యథాజ్ఞానమనగా ధర్మమందు ధర్మాంతరప్రతిపత్తి, ఉదాహరణము- పీతశ్శంఖః- శంఖము పచ్చనిది అని శంఖమునకు స్వాభావికమైన తెలుపుగుణమును గ్రహింపక పచ్చనిదిగా గ్రహించుట. విపరీతజ్ఞానమనగా ధర్మియందు ధర్మ్యంతరప్రతిపత్తి, ఉ॥ ఇదం రజతమ్ అని శుక్తికను రజతముగా గ్రహించుటయు, రజతమును, గంగము అనగా తగరముగా గ్రహించుటయు.

౨. కర్మమనునది పుణ్యము పాపము అని రెండువిధములై యుండును, పుణ్యమున్ను పాపమువలెనే మోక్షప్రతిబంధకమగుటచేతను పాపశబ్దములో అంతర్భూతమగును కాబట్టి సర్వపాపేభ్యో అను స్థలమందు పుణ్యములున్ను పాపశబ్దముచేత చెప్పబడుచున్నవి.

౩. వాసన అనగా అబుద్ధిపూర్వకమయిన వ్యాపారమునకు హేతువు అయియుండునది ఇదియును అజ్ఞానవాసన, కర్మవాసన, ప్రకృతిసంబంధవాసన అని త్రివిధములుగానుండును.

౪. రుచియనగా, బుద్ధిపూర్వకవ్యాపారమునకు హేతువు, అది

జ్ఞానాది ఉపాయాంతరములను స్వరూపతః విడువలేదు. విడువం బడు ఉపాయత్వమునే విడచినాడు.

౯౩. స్వవర్ణ, స్వాశ్రమముల ఉచితముగా చేయుచు చేయు విహితకర్మయందు ఉపాయబుద్ధి లేక లోకసంగ్రహముకొరకు కృపచేత పరులకొరకు చేయుటచేతను ఆకర్మము ఈశ్వరునికి మిక్కిలి ప్రియమై యుండును. అందువలననే ఈశ్వరప్రీతికొరకు చేయు కైంకర్యములో చేరును.

ఆత్మస్వరూపజ్ఞాన పూర్వకముగా పరమాత్మస్వరూపమును సాక్షాత్కరించుటకు ఉపయుక్తమైన జ్ఞానమందు ఉపాయబుద్ధి పోవుటతోనే ఇది స్వరూపజ్ఞానములో చేరును

భగవత్ప్రాప్తికి సాధనమైన భక్తియందు ఉపాయత్వము పోవుటతోనే భోజనమునకు పూర్వమందుండు ఆకలి వలెనే ఇది ప్రాప్యమైన కైంకర్యమునకు పూర్వక్షణమందుండు రుచిలో చేరును, సిద్ధోపాయవరణరూపమైన ప్రపత్తియందు ఉపాయత్వము పోవుటతోనే ఇది భగవదత్యంతపరతంత్రమైన ఆత్మస్వరూపము యొక్క యాథాత్మ్యజ్ఞానములో చేరును.

౯౪. భగవత్ప్రాప్తియనెడు ఒక్కఫలమునకు అనేక జన్మసహస్రములయందు సిద్ధించు కఠినమైన భక్త్యుపాయమును ఈ జన్మమందే ఒక్కపర్యాయమే చేయతగినదై సులభమైన ప్రపత్త్యుపాయమును ఉపదేశించుటచేతను సాధనములయందుండు తారతమ్యమును చూడక వాటిని సమముగా చేసి ఫలమునిచ్చు సర్వేశ్వరుని యొక్క అనుగ్రహమే ప్రధానము కాబట్టి భక్తిప్రపత్తులు ఉపాయములు కావు ఈశ్వరానుగ్రహమే ఉపాయము.

౯౫. ఫలసిద్ధికి చేతనుడు చేయవలసినది ఈశ్వరుడు చేయు రక్షణమును స్వయత్నముచేత నిషేధింపకపోవుటయును వాడు ఇచ్చు ఫలము పురుషార్థమగునట్లు అర్థించుటయును ఇంతమాత్రము చాలును.

౯౬. శక్తస్వరూపులయిన చక్రవర్తి తిరుమగనారు, పాపి

ఈ చరమశ్లోకమందు సర్వధర్మాన్ అను పదముచేతను సిద్ధోపాయస్వీకారమునకు అంగములగు త్యాజ్య ధర్మములును, పరిత్యజ్య అను పదముచేతను ఆధర్మముల యొక్క త్యాగప్రకారమును, మామ్ అను పదము చేతను త్యాగపూర్వకముగా ఆశ్రయింపబడు సౌలభ్యాదిగుణవిశిష్టవస్తువును, ఏకశబ్దము చేత ఆగుణవిశిష్ట వస్తువుయొక్క సహాయాంతర వైరపేక్ష్యమును, శరణశబ్దముచేతను ఆవస్తువుయొక్క ఉపాయత్వమును, వ్రజ అను పదము చేత ఉపాయస్వీకారమును, అహమ్ అనుపదముచేత క్రిందస్వీకరింపబడిన ఉపాయవస్తువుయొక్క జ్ఞానశక్త్యాదిగుణయోగమును, త్వా అను పదముచేత ఆవస్తువునందు న్యస్తభరుడైన అధికారియొక్క స్వరూపమును, సర్వపాపేభ్యః అనుపదముచేత ఆఅధికారికి విరోధియగు పాపసమూహమును మోక్షయిష్యామి అను పదముచేతను, ఆపాపవిమోచనప్రకారమును, మాశుచః అనుపదము చేత పాపవిమోచకుడగు ఈశ్వరుని ఆశ్రయించిన అధికారియొక్క నిర్భరత్వమును, చెప్పబడెను-

జీయర్ తిరువడిగళే శరణమ్-

---

తిరుమన్త్రార్థము సంపూర్ణము.

